


# శర్మిష్ఠ



ర చ యి త :

"నాట్యకల్హార" "నాట్యాచార్య".

శ్రీ సప్పా దుర్గా ప్రసాద్

ప్ర చు ర ణ :

నటరాజ నృత్య నికేతన్

దా న వా యి పే ట

రాజమండ్రి - 533 103.

# స్తుతి

దేవం, విభుం, త్రిభువనాధి పతిమ్
కైలాస పర్వత గుహాభిరతమ్
శైలేంద్ర రాజ తనయా దయితం
మూర్ధ్నా నతోఽస్మి పురనాశ కరమ్.

దేవుడు, విభుడు, మూడులోకాలకు అధిపతి.
కైలాస పర్వతము మీద నివశించేవాడు.
త్రిపురాసురులనే రాక్షసులను చంపినవాడు.
పర్వతరాజు కుమార్తె పార్వతీ దేవి యొక్క భర్త
అయిన ఆ శివునకు శిరస్సువంచి నమస్కరిస్తున్నాను.

నాట్యాచార్యునిగా, నాట్య కళా పరిశోధకునిగా అనేక గ్రంథాలను రచించి, రచయితగా నాకు ప్రేరణ కల్గించిన నా గురుదేవులు శ్రీ నటరాజ రామకృష్ణ గారికి పాదాభివందనం చేస్తూ ఈ నాటి మహానుభావులయిన నాట్య శాస్త్ర వేత్తలందరికీ నమస్కరిస్తూ తప్పొప్పులను సవరించి, మీ విలువయిన ఆశీర్వచనాల్ని అందిస్తారని ఆశతో,

మీ

దుర్గాప్రసాద్



# అంకితం

మంచికి మరో పేరయిన

మహామనిషి

శాంతమూర్తి

పితృ సమానులయిన

కీ॥ శే॥ పర్వతనేని బసవ వెంకట కృష్ణ

ధర్మారావు గార్కి

భక్తితో

ఈ చిన్ని గ్రంథాన్ని అంకితమిస్తున్నాను.

— రచయిత



# కృతజ్ఞత

నా చిన్న తమ్ముళ్ళకూ,

నా చిన్నారి చెల్లాయిలకూ

నాట్యం గూర్చి చెప్పాలనే

నా ఆకాంక్షను అర్థం చేసికొని

నాకు అన్ని విధాలా సహకారమందించి

నా సిరిమువ్వల సవ్వడి మీ అందరికీ వినిపింప జేసిన

నాకు ఆత్మీయురాలు

నా శిష్యురాలు

**శ్రీమతి శారదా రామకృష్ణకు**

నా కృతజ్ఞతలు తెల్పుకుంటున్నాను.

— రచయిత

# ఆశీస్సులు



నృత్య కళను – శాస్త్రం, సంప్రదాయం గురుముఖంగా అభ్యసించి, ఆరాధించి, పూర్తిగా అర్థం చేసుకొని బాలలకు నాట్య గ్రంథాలు రచించిన వారు భారత దేశంలోనే అరుదు. ఆంధ్ర దేశంలో అది నాతోనే ప్రారంభమైంది.

నా రచనలు వర్తనబాల, డాన్సింగ్ బెల్సు (ఇంగ్లీషు) నర్తన సీమ, నర్తన భూమి, నర్తన కథ ఈ గ్రంథాలన్నింటికీ వరుసగా భారత ప్రభుత్వం అవార్డులు లభించాయి. అటుపై పెద్దల అభిప్రాయాలను మన్నించి నేను అవార్డులకు రచనలు చేయుటం విరమించాను.

మరల యింత కాలానికి నా శిష్యుడు చి॥ సప్పా దుర్గా ప్రసాద్ నృత్య కళా సరస్వతికి సమర్పించే తొలి పూజా పుష్పమిది. ఈ తప్పటడుగులను కళాలోకం ఆదరించి, అతన్ని ప్రోత్సహిస్తుందని ఆశిస్తున్నాను. అతన్ని ఆశీర్వదిస్తున్నాను.

కళాసరస్వతి

హైదరాబాదు – 20.

భరత కళాప్రపూర్ణ

24–3–86

డా॥ నటరాజ రామకృష్ణ

# ఆముఖమ్

"ఆంధ్ర" శబ్దం క్రీ. పూ. 600 క్రితం ఐతరీయ బ్రాహ్మణంలో పేర్కొనబడింది. ఆంధ్రుల నృత్య కళ కూడా అంతే ప్రాచీనమైనది. శాతవాహనుల, ఇక్ష్వాకుల కాలం నుండీ ఈ కళ పరిపూర్ణ ప్రభావంతో విరాజిల్లిందనడానికి అమరావతి, నాగార్జునుని కొండ శిల్పాలే సాక్ష్యం. కాకతీయుల కాలం వచ్చేటప్పటికి మూడు పూవులారు కాయలుగా విలసిల్లినది.

ఈ నృత్య రీతులకు "ఆంధ్ర నాట్యము" అని ఆంధ్రప్రదేశ్ నృత్య ఏకాడమీ పేరిడినది. దీనిని నృత్య కళా తపస్వి నటరాజ రామకృష్ణ అత్యున్నత శిఖరాగ్రములకు గొని పోయారు.

వారి శిష్యుడు శ్రీ దుర్గా ప్రసాద్ నటరాజ నృత్య నికేతన్ స్థాపించి, అనేక మంది శిష్యులకు అభ్యాసము చేయించి గురు పూజలందుకొని ప్రజల్లోకి తీసుకు పోవడం ముదావహం.

యీ "సిరిమువ్వల"కు నాచే యీ కొద్ది వాక్యాలను రాసే గౌరవం లభింప జేసినందులకు కృతజ్ఞత లర్పిస్తున్నాను. ఆంధ్రులకు తమది అన దగ్గ ఒక నాట్యరీతి "ఆంధ్ర నాట్యము" అందిస్తున్న వారికి, వారి గురువు గారికి మరోసారి అభివాదములు.

—పడాల రామారావు

ఓం ఆంజనేయాయనమః

# ఆశీరుపాయనము

నాట్యాచార్య! నాట్య కల్హార! చి॥ సప్పా దుర్గా ప్రసాదు నాకు చిన్నతనం నుండీ తెలుసును. "పూవు పుట్టిన తోడనే తావి గొలుపు" అన్నట్లు మా మిత్రులు ఆంధ్ర దేశాన ప్రఖ్యాత నర్తన వర్తనమును గాంచిన శ్రీ సప్పా సత్యనారాయణ నాట్యాచార్యులకు పుట్టిన ప్రసాదము.

గురు దేవులగు తండ్రిగారి దగ్గర ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన డా॥ శ్రీ నటరాజ రామకృష్ణ మహోదయుల వద్ద నాట్యశాస్త్రాధ్యయనం చేసి యీయన మహానటుని కృపచేత "సిరిమువ్వలు" అను గ్రంథం వ్రాసాడు. యీ పొత్తాన్ని ఆమూలాగ్రము చదివి ఆనందించాను. నాట్య విద్య పసి పిల్లలకు గూడా బోధపడాలని పసిడిపలుకులుగా పలికిన గ్రంథ మిది, యీ చిరంజీవి రాజమహేంద్రవరానికే వన్నియ గూర్చినట్లు ఈ గ్రంథ రచన సాగించుట ఆనందం. యింకా అనేకానేక గ్రంధాలు వ్రాసి ప్రపంచ ప్రఖ్యాతి గాంచుగాక అని మనస్ఫూర్తిగా ఆశీరుపాయనము లందించి నా ఉపాసనా మూర్తియగు ఆంజనేయస్వామి యీయనకు సమస్త భాగ్యములిచ్చుగాక అని ఆకాంక్షిస్తున్నాను.

ఇట్లు,

శాంతిశ్రీ బొత్సకవి

రాజమండ్రి-5.

తేదీ : 29-3-1986

# తల్లి తండ్రులారా ఒక్క నిమిషం

ప్రియమైన తల్లి తండ్రులారా!
పూవు పుట్టగానే పరిమళిస్తుంది.
అలాగే కళమీద ఆశక్తి మీ చిన్నారులలో చిన్ననాడే కలిగి ఉంటే!
వారు ఏ సంగీతం విన్నా చిట్టి చేతులు ఊపుతూ.
కాళ్ళు కదిలిస్తూ కేరింతలు కొడుతుంటే!
మీ చిరంజీవులకు మీ దగ్గరలోని నాట్యాచార్యుని వద్ద నాట్యం నేర్పించండి!
ఆంధ్రుల నాట్య కళా సాంప్రదాయాలను ఆదరించండి!
ఆంధ్రులకు గర్వకారణమైన అభినయం చెప్పించండి!
ఆంధ్రుల చిన్నారి హృదయాలలో నాట్య బీజం నాటుట కొరకే ఈ చిన్ని గ్రంధం చిన్నారులకు నాట్యం అంటే ఏమిటో తెలియని వారికి కూడా అర్ధం అయేలా వ్రాసాను.
ఈ గ్రంధం చదివి మీ విలువైన అభిప్రాయాన్ని అభిమానంతో అందించండి!

ఆశీర్వదించండి.

కళాభివందనములతో
మీ
దుర్గా ప్రసాద్

# చిన్నారులకు చిన్న మాట

చిరంజీవులారా!

మీలో చాలా మందికి నాట్యం అంటే చాలా ఇష్టం కదూ! నృత్య ప్రదర్శనలలో, టెలివిజన్‌లలో, సినిమాల్లో ఇంకా అనేక చోట్ల నాట్యాన్ని చూసి, ఇంటి దగ్గర చేతులు త్రిప్పుతూ, కాళ్ళను అనేక రకాలుగా ఆడిస్తూ మీ తల్లిదండ్రులను ఆనందంతో ముంచెత్తు తుంటారు, ఔనా!

మీలో చాలామందికి నాట్యం నేర్చుకోవాలని ఉంది కదూ!

నాట్యాన్ని గూర్చి తెలుసు కోవాలనీ ఉంది,

అందుకే

ఎందరో మహానుభావులు నాట్యం గురించి గ్రంథాలు అనేకం వ్రాసినా సాహసించి నాకు వచ్చిన విద్యను మీకు అందించాలని ఈ చిన్న గ్రంథం మీకు అర్ధం అయ్యేలా వ్రాశాను. ఈ గ్రంథం చదివి మీకు అర్ధం కాని విషయాలుంటే నాకు ఉత్తరం వ్రాయండి. లేదా నన్ను కలుసుకొని అడుగుతారు కదూ!

ఇట్లు, మీ అన్నయ్య

దుర్గా ప్రసాద్

# ఈ గ్రంథం లోపలి పేజీలలో

# పంచమ వేదం

తమ్ముళ్ళూ!

బ్రహ్మదేవుడు వేదాలు వ్రాశాడు.

వేదం అనే పేరు వినే వుంటారు ఔనా!

ఈ వేదాలు నాలుగు.

భారతీయులకు అతి పవిత్రమైన గ్రంథాలే ఈ వేదాలు.

వేదం భారతదేశంలో తప్ప మరే యితర దేశంలోనూలేదు.

అందుకే వివిధ దేశాలవారు మన భారతదేశం వచ్చి

మన హిందూమతంలో చేరి, వేదాలు నేర్చుకుంటున్నారు.

ముందుగా నాలుగు వేదాలు వ్రాసిన బ్రహ్మదేవుడు

అందరికీ అర్థం అయేలా, ఆనందించటానికి వీలుగా,

ఐదవ వేదం వ్రాసాడు. ఎలా అంటే,

మొదటిది ఋగ్వేదం — దానినుండి వాయిద్యాన్ని:

రెండవది యజుర్వేదం — దానినుండి శరీరాన్ని కదిలించడం మాటలకు అర్థం చెప్పడం:

మూడవది సామవేదం — దానినుండి తీయగా, హాయిగా అందంగా పాడే విధానాన్ని:

నాల్గవది అధర్వణవేదం — దానినుండి అనేక భావాలు ప్రదర్శించడం.

ఇలా నాలుగు వేదాల సారాన్ని కలిపి

"నాట్య వేదం" పంచమ వేదంగా వ్రాశాడు.

తెలిసిందా!

# నాట్యము

చెల్లాయిలూ!

నాట్యం వేరు, నృత్యం వేరు. నృత్తం వేరు.

ముందుగా నాట్యం గూర్చి తెలుసుకోండి —

ఏదైనా ఒక కథలోని పాత్రలు అనేక మంది నర్తకులు

ఆ కథలోని పాత్రలకు సరిపడే వేషాలు వేసికొని,

ఆ కథకూ, ఆ పాత్రలకూ సరిపడగా అభినయిస్తూ,

ఆ కథను మనందరికీ సులభంగా అర్థం అయేలా

నాట్యం చేస్తారు.

ఆ నాట్యంలో నవరసాలు పోషించి, జనులను రంజింపజేస్తారు.

దీనినే నాట్యం అంటారు.

అంటే ఎక్కువ మంది, రకరకాల వేషాలు వేసి,

ఒక కథను ప్రదర్శించడాన్ని "నాట్యం" అంటారన్నమాట!

అర్థం అయిందా తమ్ముళ్ళు, చెల్లాయిలూ!

# నృత్యము

రెండవది నృత్యము.

శివుడిపై గానీ, కృష్ణుడుపై గానీ
శ్రీ మహా విష్ణువుపై గానీ, పార్వతీ దేవిపై గానీ
మరి ఏ ఇతర దేవతలపై గానీ
వారి లీలలను అంటే వారు చేసిన మంచిపనులను
నర్తకి గానీ, నర్తకుడు గానీ పొగడుతూ
చేతి ముద్రలతో తెల్పుతూ, అనేక రకాలుగా పాదాలు
కదలిస్తూ, అభినయిస్తూ,
ఆ దేవుని భంగిమలో నిలబడి ఆడే విధానాన్ని
"నృత్యము" అంటారు.

ప్రక్క పేజీలో బొమ్మలు చూడండి
అవి నృత్యానికి సంబంధించినవే!

# నృత్తము

మరి మూడవది "నృత్తము" కదూ!

ప్రతి నాట్య ప్రదర్శనం నృత్తముతో ప్రారంభమవుతుంది

ఈ నృత్తానికి పాట ఉండదు.

తాం. తెయ్

తత్. తత్. తత్తై. తెయ్ తాం

ఇలాంటి శబ్దాలను సంగీతంతో కూర్చి నృత్తం ఆడాలి

ఈ శబ్దాలను మృదంగంపై పలికించాలి

నృత్తం ఆడేటప్పుడు నర్తకి ముఖంలో ఏ రకమైన

భావం ఉండదు. చేతులు, కాళ్ళు కదలికలు మాత్రమే

కానీ చూడటానికి చాలా అందంగా ఉండి

చూసే వారికి ఆనందాన్ని. అహ్లాదాన్ని కల్గిస్తాయి.

అంటే

భావం, రసం లేకుండా జతులపై నర్తకులు

ఆడే విధానాన్ని "నృత్తం" అంటారు.

తెలిసింది కదూ!

# సంధ్యా తాండవమూర్తి

తమ్ముళ్ళూ!

శివుడు ప్రతి సంధ్యా సమయంలో
సూర్యుని బంగారు కిరణాలు ఆ కైలాస పర్వతంపై పడి
ఆ తెల్లని మంచు కొండలు బంగారు కాంతిలో మెరిసి
పోయే సమయంలో ఆనందంతో పార్వతీ దేవి ముందు
శివుడు తాండవం ఆడేవాడు
అప్పుడు
బ్రహ్మదేవుడు తాళం వేసేవాడు
శ్రీ మహావిష్ణువు మృదంగం వాయించేవాడు
సరస్వతీ దేవి వీణ వాయించేది
లక్ష్మీదేవి పాట పాడి. తుంబురుడూ, నారదుడూ
వంత పాట పాడేవారు
దేవతాధిపతి దేవేంద్రుడు వేణువు ఊదేవాడు
ప్రథమ గణాలు, దేవతలూ, అందరూ ఆ తాండవం
చూచి ఆనందించే వారు
అందుకే శివుడుని సంధ్యా తాండవమూర్తి
అంటారు.

# ఆదిదంపతుల తగవు

చిన్నారి పాపాయిలూ!
ఆదిదంపతులంటే శివుడు, పార్వతి
ఒక్కసారి వారిద్దరూ నాట్యంలో నేను గొప్ప అంటే
నేను గొప్ప అని తగవులాడుకొన్నారు.
ఆ తగవు తీర్చడానికి బ్రహ్మ, విష్ణు, లక్ష్మీదేవి, సరస్వతి
దేవతలు, కిన్నెరులు, కింపురుషులు, యక్షులు, గంధర్వులు
అందరూ వచ్చారు.
ఇద్దరూ నాట్యం ప్రారంభించారు.
కానీ, నాట్యంలో ఇద్దరూ సమానులే
అందువల్ల ఎవ్వరూ ఓడి పోవడం లేదు.
అప్పుడు శివుడు ఏం చేశాడంటే
చాలా తెలివిగా ఒక కాలు తలపై నుంచుకొని
నృత్యం చేశాడు,
పార్వతీ దేవి ఆడదిగదా!
సిగ్గుపడి అలా చేయలేక పోయింది!
ఇంకేముంది
శివుడే గెలిచాడు.
శివునికి ప్రీతికరమైన ఆ భంగిమ పేరు
"నిశుంభిత" అంటారు.

# నటరాజు

శివుడు నాట్యానికి రాజు.

అందుకే ఆయనను "నటరాజు", మహానటుడు అనికూడా అంటారు.

తమ్ముళ్ళూ, చెల్లాయిలూ మీ ఇంట్లో కూడా నటరాజ విగ్రహం ఉండే ఉంటుంది.

అందంగా ఉండే ఆ నటరాజ స్వామి భంగిమలో ఎంత అర్థం, పరమార్థం ఉందో తెలుసా!

ఆ చుట్టూ ఉన్న అగ్నితో కూడిన మండపం ఓంకారానికి గుర్తు
తలలోని గంగ సంపదలకూ, చంద్రుడు అనుగ్రహానికి గుర్తు
మూడు కన్నులు మూడు కాలాలకు గుర్తులు.
అంతేకాదు ఆ మూడవ నేత్రం జ్ఞానానికి గుర్తు
"డమరుకం" పట్టిన చేయి సృష్టికి గుర్తు
"అగ్ని" పట్టిన చేయి సంహారానికి గుర్తు
"అభయం" పట్టిన చేయి స్థితి చిహ్నం
మరి వాల్చి పట్టిన చేయి చూడండి. అది అనుగ్రహానికి
ఆయన కాలి క్రింది రాక్షసుడు అహంకారానికి గుర్తు
అంటే అహంకారాన్ని, అజ్ఞానాన్ని శివుడు అణచి వేశాడన్న మాట.
పైకి ఎత్తిన ఎడమ పాదం మోక్షానికి గుర్తు

అర్థం అయిందా! అందమైన ఆ "నటరాజు" భంగిమలో ఆనంద కారకుడైన శివుడు ఎంత అర్థాన్ని దాచి ఉంచాడో!

# కృష్ణతాండవం

మడుగుకు జని, కాళీయుని పడగలపై
భరత శాస్త్ర పద్ధతి వెలయున్.
కడు వేడుకతో ఆడెడు, మువ్వల సవ్వడి
నా మదిని దలతు తాండవ కృష్ణా.

చిరంజీవులారా!
శ్రీకృష్ణుడు నాట్యం చేశాడు తెలుసా!
కాళింది మడుగులో
కాళీయుని గర్వాన్ని అణచడానికి
కాళీయుని పడగలపై ఆ చిన్నారి కృష్ణుడు
అందంగా, ఆహ్లాదంగా తాండవం చేసి
వ్రేపల్లె వాసుల కన్నులకు విందు చేశాడు.
పిల్లన గ్రోవి వూదుతూ గోప స్త్రీలతో
ఆ బాలకృష్ణుడు, గోపాల కృష్ణుడయి నాట్యం చేశాడు.
ఆ నాట్యానికే రాసలీల రాసక్రీడ అని అంటారు.
అంతే! మరి ఎప్పుడూ కృష్ణుడు నాట్యం
చేసినట్టు చరిత్రలో కనబడదు.
తెలిసిందా చిన్నారులూ!

# నాట్యము ఆడిన దేవతలు

బాలలూ!

కొందరు దేవతలు నాట్యం చేశారు వారిని గూర్చి చెబుతాను వినండి

లక్ష్మీదేవి నాట్యం చేసింది.

శ్రీ మహా విష్ణువు మోహినీ రూపంలో అనేక సార్లు అనేక విధాలుగా నాట్యం చేశాడు.

ఒకసారి దేవతలకూ, రాక్షసులకూ అమృతం పంచడంకోసం మరోసారి భస్మాసురుడనే రాక్షసుణ్ణి చంపడానికి నాట్యాన్నే ఆయుధంగా చేసి, ఆ రాక్షసుణ్ణి తెలివిగా చంపాడు.

అంటే లోక కళ్యాణానికి నాట్యం ఎంత బాగా ఉపయోగ పడిందో అర్థం అయిందా!

హాహా, హూహూ అనే గంధర్వ సహోదరులు చదువుల తల్లి సరస్వతీ దేవి, బ్రహ్మదేవుల ముందు నాట్యం చేసి వారి మెప్పు పొందారు.

మరి రంభా, ఊర్వశీ, మేనకలు నాట్యం చేశారనే సంగతి మీ అందరికీ తెలిసిందే గదూ!

"తిలోత్తమ" అనే మరో అప్సరస కూడా నాట్యం చేసిందని చెబుతారు.

ఇలా ఎంతోమంది దేవతలు, గంధర్వులు, అప్సరసలు నాట్యం చేసి మెప్పు పొందారు.

తెలిసిందా చిన్నారులూ!

# నాట్యమాడిన మహాపురుషులు

తమ్ముళ్ళూ!

చాలామంది పురాణ పురుషులు నాట్యం చేశారు.

వారిలో కొంతమందిని గూర్చి చెబుతాను.

"ఆంజనేయుడు" నాట్యం చేశాడు. ఈయన శ్రీరాముని భక్తుడు. రామగానం చేస్తూ నృత్యం చేసేవాడు.

"రావణాబ్రహ్మ" అంటే సీతను ఎత్తుకు పోయిన రావణాసురుడు రాక్షసుడైనా పరమ శివుని భక్తుడు. ఎంత గొప్ప భక్తుడంటే తన పొట్ట చీల్చుకొని. ప్రేవులతో వీణ వాయించాడు. అంత భక్తుడయిన రావణుడు నాట్యం చేయడంలో కూడా చాలా గొప్పవాడు.

"నారదుడు" ఈయన కూడా నాట్యంలో గొప్పవాడే.

"అర్జునుడు" ఊర్వశివద్ద నాట్యం నేర్చుకొని. ఒక సంవత్సరం అజ్ఞాతవాస సమయంలో బృహన్నలగా ఉత్తర అనే రాజ కుమారికి నాట్యం నేర్పాడు. అర్జునుడు విలువిద్యలోనే గాక నాట్యం, సంగీతంలో కూడా గొప్ప విద్వాంసుడు.

"భరతుడు" ఈయన బ్రహ్మదేవుని వద్ద నృత్యం నేర్చుకొని పార్వతీ పరమేశ్వరుల ముందు నృత్యం చేసి మెప్పించాడు శివుడు మెచ్చి తన ప్రమధ గణాలలో తండుడు అనే వాని చేత భరతునికి తాండవం కూడా నేర్పించాడు.

ఈయనే అనేక గ్రంధాలు కూడా రచించాడు.

యింకా నందికేశ్వరుడు, దత్తిలుడు, కోహలుడు, యాజ్ఞవల్క్యుడు, బృహస్పతి ఇలా అనేక మంది నాట్యం చేశారు.

# పక్షులు నాట్యం చేస్తాయి

చెల్లాయిలూ!
ఈ సృష్టిలోని ప్రతి ప్రాణి నాట్యం చేస్తుంది తెలుసా!
నాట్యం చేసే పక్షులున్నాయి.
ఆ పక్షులను గూర్చి తెలుసు కుందాం.
నాట్యం చేసే పక్షులలో అగ్రస్థానం మన జాతి పక్షి నెమలిది
వర్షాకాలంలో నల్లని మబ్బులతో ఆకాశం నిండి. మేఘాలు
ఫెళ ఫెళ ఫెళమని ఉరిమే సమయంలో
మధ్య మధ్య ధణేల్. ధణేల్ మని మెఱుపులు మెరిసే సమయం
ఆ ఆహ్లాదకరమయిన సమయంలో ఆనందం పట్టలేని
మగ నెమిళ్ళు తమ రంగు రంగుల పురులు విప్పి నాట్యం
చేస్తాయి
ఆడ నెమళ్ళు చూసి ఆనందిస్తాయి.
అలా చల్లగా ఉండే సమయం మనకి హాయిగా ఉంటుంది
కదూ!
అదే సమయంలో నెమళ్ళు నాట్యం చేసి నెమలీతలను
మెప్పిస్తాయి.

## హంస

మెల్లగా మెల మెల్లగా అడుగులో అడుగువేస్తూ—
వయ్యారంగా నడచే పక్షి హంస.
ఆ హంస నడకే నాట్యం ఆడుతున్నట్లు ఉంటుంది.
అందుకే అందంగా నడిచే వారిని "కలహంస"
"హంస నడకల చిన్నది" అని అంటారు.
అంటే హంస నడుస్తూనే నాట్యం చేస్తుందన్న మాట.
హంస నడకలపై అనేక పాటలున్నాయ్ మన తెలుగు భాషలో

# పాము నాట్యం చేస్తుంది

అందంగా మెరుస్తూ జరజరా ప్రాకే పాము కూడా నాగ
స్వరం వినగానే అందమైన తన పడగవిప్పి, మైమరచి
నాట్యం చేస్తుంది.
ఒక్కోసారి భయంకరంగా బుసకొడుతూ. నాలుక బైటకు
చాపుతూ కోపంగా కూడా నాట్యం చేస్తుంది.
అంత సంగీతంలో లీనమై నాట్యం చేస్తుంది గాబట్టి
నాగ స్వరం ఊది పుట్టలో నిద్రపోతున్న పాములను
బైటకు రప్పించి, ఆదమరచి నాట్యం చేస్తున్న పాములను
పట్టుకొని దాని విషం పిండి, వీధులలో పాములచేత నాట్యం
చేయించి డబ్బు చేసుకుంటారు పాముల వాళ్ళు
పాము చేసే నాట్యం మీరూ చూసే ఉంటారు కదూ!

# కోయిల పాట

మనకు సంవత్సరంలో వచ్చే ఆరు ఋతువులలో వసంత
ఋతువు అందమైనది.
ఎక్కడ చూసినా లేత చివుళ్ళతో చెట్లన్నీ పచ్చగా ఉంటాయి
మంచి వాసనలతో పువ్వులు విరబూసి ఉండే ఈ ఋతువు
లేత మామిడి చివుళ్ళుతింటూ, మామిడి పూలలోని తేనెలు
త్రాగి మత్తెక్కిన కోయిల తీయగా పాడుతుంది.
ఆ పాట ఎంత ఆనందం కల్గిస్తుందో తెలుసా!
అందుకే "కోయిల గానం" "గానకోకిల" అని బాగా పాడే
వారిని అంటారు పెద్దలు.
కుహూ! కుహూ అని పాడే కోయిల పాట మీరు విన్నారా!
చెల్లాయిలూ

# గాలి వాయిద్యాలు

తమ్ముళ్ళూ!

వాయిద్యాలు నాలుగు రకాలు :

1. గాలి వాయిద్యాలు
2. చర్మ వాయిద్యాలు
3. తంత్రీ వాయిద్యాలు
4. లోహ వాయిద్యాలు

ముందుగా గాలి వాయిద్యాలను గూర్చి తెలుసుకుందాం నోటితోగానీ మరి ఏ యితర పద్ధతుల ద్వారా గాని వాయిద్యాల్లోనికి గాలిని పంపి దానినుండి వచ్చే శ్రావ్యమైన సంగీతాన్ని వినిపించే పద్ధతే గాలి వాయిద్యం ఉపయోగించే పద్ధతి. అంటే గాలి ద్వారా వాయిద్యంలో శబ్దం ఉత్పత్తి అవుతుందన్న మాట.

అలా వచ్చే శబ్దాలను సంగీత సరళిలో "స రి గ మ ప ద ని" అను సప్త స్వరాలు పలికిస్తారు.

చిన్ని కృష్ణుని చేతిలోని మురళి. ఆ మురళీ రవంతోనే శ్రీకృష్ణుడు లోకాన్ని రసజగత్తులో ముంచేవాడు.

పరమ శివుని చేతిలోని శంఖం. ఈ వాయిద్యం దేవతలందరి చేతులలో ఉంటుంది. గానీ. శివునికి శంఖం అంటే ప్రీతి.

పెళ్ళిళ్ళకు వాయించే సన్నాయి.

"హార్మోనియం" ఇది ఎక్కువ హిందుస్తానీ సంగీతంలో ఉపయోగిస్తారు.

పూర్వం సంగీత విద్వాంసులు శృతి కోసం "తిత్తి" అనే సాధనాన్ని ఉపయోగించేవారు.

రాజుల కోటలలో ఉపయోగించే బాకాలు, కొమ్ము బూరలు ఇలా ఎన్నో వాయిద్యాలు ఉన్నాయి గదూ!

వాటన్నిటినీ గాలి వాయిద్యాలు అంటారు.

# చర్మ వాయిద్యాలు

చర్మ వాయిద్యాలంటే జంతువుల చర్మంతో. మట్టి. కర్ర. లోహంతో తయారు చేసిన గుల్లలకు మూతలు కుట్టి వాటి ద్వారా శబ్దం పలికించడాన్ని చర్మ వాయిద్యం అంటారు. నాట్యానికి అతి ముఖ్యమయిన ప్రక్క వాయిద్యం మృదంగం.

ఈ మృదంగం గూర్చి వివరంగా తరువాత చెబుతాను.

పెళ్ళి సమయంలో శుభకార్యాలలో సన్నాయి మేళంలో ఉపయోగించే "డోలు"

సాంబ సదా శివుని చేతిలో ఉండే "డమరుకం"

రాజుల కోటలలో ఉండే "నగారా" ఇది చాలా పెద్దదిగా ఉండి ఒక్కసారి మ్రోగిస్తే సుమారు మైలు దూరం వరకూ ఆ నాదం వినిపిస్తుంది.

ముందు చెప్పిన మృదంగాన్ని మధ్యకు కోసివేసి తబలా సృష్టించారు. ఇది కూడా హిందుస్తానీ సంగీతంలో ఎక్కువ ఉపయోగించే వాయిద్యం.

అమ్మవారి జాతర్లలో, చాటింపు వేసే సమయంలో ఉపయోగించే "డప్పు" చూశారు కదూ?

ఇది కూడా చర్మ వాయిద్యమే!

ఇలా ఎన్నో రకాల చర్మ వాయిద్యాలు. వాడి ఆకారాలు శబ్దాలు ఆ ప్రాంత ప్రజల అభిరుచిని బట్టి మారుతూ ఉంటాయి.

# తంత్రీ వాయిద్యాలు

చెల్లాయిలూ!

చదువుల తల్లి సరస్వతీ దేవి వద్ద ఉండే వీణ చూశారా!

ఆ వీణ పేరు "కాశ్యపి"

ఆ వీణ వాయించడం అంటే సరస్వతీ దేవికి చాలా ఇష్టం.

అందుకే ఎప్పుడూ ఆ దేవి చేతులలో వీణ ఉంటుంది.

వీణ తంత్రీ వాయిద్యమే.

తంత్రీ వాయిద్యము అంటే తీగలు కలిగి వాటిని మీటడం ద్వారాగానీ, మరి ఇతర పద్ధతులలో ఆ తీగెలద్వారా సంగీతాన్ని పలికించడమే తంత్రీ వాయిద్యా లక్షణం. తంత్రులు అంటే తీగలు.

"వాయు లీనం" చూశారా?

కమాను అనే సాధనాన్ని తీగలపై రాపిడి చేయడం వల్ల శబం వస్తుంది.

అలాగే కర్నాటక సంగీతంలో అతి ముఖ్యమయిన తంబుర ప్రముఖ హిందూస్తానీ వాయిద్యం "సితార"

వీధులలో అమ్మే "ఏక్తార్" చూశారా?

ఒకే ఒక్క తీగ కలిగి, ఆ తీగ ద్వారా అనేక శబ్దాలను పలుకుతుంది. దీనినే "ఏక్తార్" అంటారు.

మీ అందరికీ ఇష్టమయిన ఇంగ్లీషు వాయిద్యం "గిటార్"

"బుల్ బుల్" ఇలా ఎన్నో తంత్రీ వాయిద్యాలున్నాయి

తెలిసిందా చెల్లాయిలూ?

# లోహ వాయిద్యాలు

మనం గుడిలోనికి వెళ్ళినప్పుడు. దేవుని ముందు పెద్దగంట వ్రేలా డుతూ ఉంటుంది గదూ! అమ్మ మిమ్మల్ని తన చేతులతో పైకి ఎత్తి మీ చేత ఆ గంటను కొట్టిస్తుంది. అవునా!
అలా గంట కొట్టడమంటే మీ అందరికీ ఇష్టం కదూ!
నాకు కూడా చాలా ఇష్టమే.దాన్నే లోహ వాయిద్యం అంటారు. ఏద యినా లోహంతో తయారు చేయబడి. దాన్ని కొట్టడంద్వారా నాదం వచ్చే పరికరాన్ని లోహ వాయిద్యం అంటారు.
దేవుని భజనలలో ఉపయోగించే పెద్ద పెద్ద తాళాలు.
నాట్యానికి తాళాధారిగా నాట్యాచార్యుడు లయ ప్రకారం పలికించే చిన్ని తాళాలు. వీటిని గూర్చి వివరంగా తరువాత చెబుతాను.
"జే గంటలు" అంటే మహారాజుల రాకను తెలిపేందుకూ.
మరి పూర్వకాలంలో గడియారాలు లేవు గదా!
కాలాన్ని సూచించడానికి ప్రతి గంటకూ ఒకసారి ఈ జేగంటలు ఉప యోగించి కాలాన్ని తెలిపేవారు.
ఒకసారి కొడితే ఒంటి గంట.
రెండుసార్లు కొడితే రెండు గంటలు అయినట్లు లెక్క అన్న మాట.
నాట్యం చేసే నర్తకులు, నర్తకీమణులు కాళ్ళకు కట్టుకునే "గజ్జెలు" చూశారా?
ఇవన్నీ లోహ వాయిద్యాలే!
గాలి, చర్మ, తంత్రి, లోహ వాయిద్యాలే కాక ఇంకా ఎన్నో రకాల వాయిద్య పరికరాలు మన భారత దేశంలో ప్రచారంలో ఉన్నాయి,
అర్థం అయిందా తమ్ముళ్ళూ! చెల్లాయిలూ!

# ఆంధ్రదేశంలో నాట్య రీతులు

చిన్నారులారా!

అందాల భూమి మన ఆంధ్రభూమి
అన్ని భాషలలో అందమైనది మన తెలుగు భాష
అభినయానికి పెట్టింది పేరు మన ఆంధ్ర కళాకారులు.
మరి
మన ఆంధ్ర దేశంలోని నర్తన రీతులను గూర్చి తెలుసుకుందాం.
మన ఆంధ్రా వనిలో ముఖ్యంగా
కూచిపూడి, ఆంధ్ర నాట్యం, భరత నాట్యం ప్రచారంలో ఉన్నాయి.
మన ఆంధ్ర దేశంలో తప్ప మరే యితర ప్రాంతంలోనూ, మరే దేశం
లోనూ లేనివి "కలాపములు"
శ్రీకృష్ణుని ఎనిమిది మంది భార్యలలో ముద్దుల భార్య సత్యభామా దేవి.
ఆమె తనంత అందమయిన స్త్రీ మరెక్కడాలేదని గర్వపడేది.
ఒకసారి శ్రీకృష్ణుడు నేను అందంగా ఉన్నానా? నీవు అందంగా ఉన్నావా?
అని సత్యభామను అడిగాడు. సత్యభామ నేనే అందంగా ఉన్నాను అంది.
ఇంకేముంది శ్రీకృష్ణునికి కోపం వచ్చి వెళ్ళిపోయాడు.
ఆయనను తిరిగి రప్పించడానికి సత్యభామ చేసిన హంగామాయే
ఈ కలాపం.
ఈ కలాపాలను 9 రాత్రుల గ్రంథంగా ఆలయాల్లో నర్తకీమణులు ప్రదర్శిస్తే
కూచిపూడి భాగవతులు 3 రాత్రులు ఆడేవారు.
అందుకే సత్యభామ ఆంధ్రుల ఆడపడుచు.
ఇవే కాక ఇంకా అనేక జానపద కళా రీతులు మన ఆంధ్రదేశంలో ఉన్నాయి.
వాటిని గూర్చి వివరంగా తరువాతి పేజీలలో చెప్పాను చూడండి.

# కూచిపూడి నాట్యం

ఆంధ్ర దేశంలో ప్రస్తుతం బాగా పేరున్న నాట్యమే కూచిపూడి. కొన్ని వందల సంవత్సరాలుగా కూచిపూడి అనే చిన్న గ్రామానికి చెందిన కొందరు పురుషులు (స్త్రీ వేషం కూడా ధరించి) నాట్యం చేసేవారు.
వీరినే కూచిపూడి భాగవతులు అంటారు.

వీరు పూర్వం నుండి ఊరూరా తిరిగి నృత్యం ప్రదర్శించే వారు. వీరు ఎక్కువగా శ్రీకృష్ణునికి సంబంధించిన కథలనే నాట్యం ఆడుతారు. రాత్రి పూట ప్రదర్శనం మొదలు పెట్టి, తెల్లవార్లు భాగవతం ఆడేవారు.
అందుకే వీరికి "వీధి భాగవతులు" అనే పేరు వచ్చింది.

శ్రీ సిద్ధేంద్రుడు అనే యోగీంద్రుడు వీరికి నాట్యం నేర్పిన గురువు. ఆయన అనేక రచనలతో పాటు "భామా కలాపం" అనే రచనను చేసి కూచిపూడి వారికి నేర్పించారు. పదిమంది లేదా పదిహేను మంది వరకూ ఒక్కొక్కరూ ఒక్కో వేషం వేసి నాట్యం ఆడేవారు.
ఉదాహరణకు ఉషా పరిణయం అనే భాగవతం చూద్దాం.
శ్రీకృష్ణుని మనుమడు అనిరుద్ధునికి, బాణాసురుడు అనే రాక్షసుని కుమార్తె ఉషకు పెండ్లి అన్నమాట.
దీనిలో ఉషగా, అనిరుద్ధునిగా, శ్రీకృష్ణునిగా, బాణాసురునిగా ఇలా ఒక్కొక్కరూ ఒక్కో వేషం వేసి నాట్యం ఆడుతారు. వీరందరికీ ఒక సూత్రధారుడుంటాడు. ఆయనే కథ అంతా నడిపిస్తాడు.

ఒక ఇరువై అయిదు, ముప్పై సంవత్సరముల నుండి కూచిపూడి వారు కాలమాన పరిస్థితులకు అనుకూలంగా మారి వారి నాట్య విద్యను స్త్రీలకు కూడా నేర్పించి ప్రదర్శనలిస్తున్నారు.
అందువల్లే కూచిపూడి వ్యాప్తిచెందినది.
తెలిసింది కదూ కూచిపూడి వారిని గూర్చి.

# ఆంధ్ర నాట్యం

తమ్ముళ్ళూ! చెల్లాయిలూ!
ఆంధ్ర దేశంలో పుట్టిన మనందరికీ ఒక ప్రత్యేక సాంప్రదాయ నృత్యం ఉంది.
అదే ఆంధ్రుల నాట్య సాంప్రదాయం "ఆంధ్ర నాట్యం"
పూర్వం దేవాలయాల్లో దేవుని నిద్దుర లేపడం మొదలుకొని మరలా నిద్దుర పుచ్చే వరకూ వివిధ కార్య క్రమాలలో, వివిధ రీతులలో నృత్యం ఆడేవారు అందుకే ప్రతి దేవాలయంలోనూ నర్తకీమణులుండేవారు. ఆ నర్తకీమణులు పెండ్లి చేసుకునే వారు కాదు.
దేవుని సేవలో, దేవునికై నృత్యం చేసి, తమ జీవితాలను దేవుని సేవకు అర్పించి, దేవునిలో లీనమయ్యే వారు.
అలాగే!
ప్రతి రాజాస్థానంలోనూ ఒక ఆస్థాన నర్తకీమణి మరి ఇతర నర్తకీమణులు ఉండేవారు. రాజుగారి ఆస్థానంలోని పండితులను, కవులను, మిగిలిన వారందరినీ తమ నాట్యంతో మెప్పించేవారు.
అలాగే
సామాన్య జనులందరి కోసం కూడా నృత్య ప్రదర్శనం చేసే వారు.
వీళ్ళందరూ చేసిన నాట్యమే "ఆంధ్ర నాట్యం"
ఈ ఆంధ్రనాట్యం "ఏకపాత్ర కేళిక" అంటే ఒకే నర్తకి నృత్యం చేసే విధానమన్న మాట.
ఈ నాట్యంలో అభినయానికి ఎక్కువ ప్రాధాన్యం ఉంటుంది, అభినయం చేయడంలో ఆంధ్రులకు సాటి మరి ఎవరూ లేరు.
అది మీకు తెలుసా చెల్లాయిలూ?
ఆ నాట్యంలో సంగీతం కూర్చే పద్ధతి వేరుగా ఉంటుంది.
ఈ నాట్యంలోని పాద విన్యాసాలు, చేతుల కదలికలు స్త్రీలకు ఉండే సహజమైన అందానికి అనువుగా ఉంటాయి.
"ఆంధ్రనాట్యం" క్రొత్త సాంప్రదాయం అనే అభిప్రాయం చాలా మందికి ఉంది.
కానీ
ఆంధ్రులు పుట్టినప్పుడే ఆంధ్రనాట్యం పుట్టింది.
అర్థం అయింది కదూ!

# పేరిణీ శివతాండవం

తమ్ముళ్ళూ!
మన ఆంధ్రజాతికే గర్వ కారణమైన ఒక విశిష్ట నర్తనం ఉంది.
తెలుసా మీకు?
అదే "పేరిణీ శివతాండవం"
వేయి సంవత్సరముల క్రిందట మన తెలుగు యువకులు ప్రదర్శించి మెప్పు పొందిన వీరనాట్యం.
కాకతీయ మహా రాజులయిన గణపతి దేవుడు, రుద్రమ దేవి, ప్రతాపరుద్రుల కాలంలో శివుని పూజలలో ప్రతి రోజు మూడు సారులు ఈ తాండవాన్ని ప్రదర్శించే వారు.
యుద్ధ వీరులకు ఉత్తేజాన్ని కల్గించడం కొరకు ఈ ఉద్భృత నర్తనం నర్తించే వారు.
వీరులు, మహేశులు, పశుపతులు, మైలారు దేవులనే నర్తకులు ఈ పేరిణి శివతాండవం ప్రదర్శించే వారని తెలుస్తుంది. మగవారు మాత్రమే చేయ గల ఈ తాండవ నృత్యం పురుషుని పురుషునిగా వీరుని వీరునిగా తీర్చిదిద్దే ఏకైక తాండవ నృత్యం ఈ పేరిణీ శివతాండవం
అయితే
ఇంత కష్టతరమైన, గర్వకారణమైన ఈ ఆంధ్రుల తాండవనృత్యం కాకతీయ మహారాజుల తరువాత మరుగున పడి "పేరిణీ" అంటే ఏమిటో? దాని పేరు, దాని విశిష్టత మర్చిపోయారు మన ఆంధ్రులు.
అర్థం అయిందా తమ్ముళ్ళూ?
శ్రీ నటరాజ రామకృష్ణగారు అనే మహానుభావుడు, కాకతీయ సేనాని జాయప రచించిన "నృత్త రత్నావళి" అను గ్రంథం, రాయప్ప దేవా లయం లోని శిల్ప సౌంధర్యాలను ఆధారంగా చేసికొని పది సంవత్సరాలు నిర్విరామ కృషిచేసి "పేరిణీ శివతాండవాన్ని మరలా సృష్టించారు. అంటే దాదాపు ఏడు వందల సంవత్సరాల తరువాత కాల గర్భంలో కలిసిన మన ఆంధ్రుల తాండవాన్ని పునః సృష్టి చేసిన "పేరిణి సృష్టికర్త" — మన నటరాజ రామకృష్ణ గారు.

ఈ తాండవంలో నర్తకుడు శివుణ్ణి రుద్రునిగా ప్రేరణచేసి శివ శక్తిని తనపై ఆవహింప జేసుకుంటాడు. అందుకే ఈ నృత్యానికి "ప్రేరణ శివతాండవం" "పేరిణీ శివతాండవం" అనే పేరు వచ్చింది. ఈ తాండవం చూసే ప్రతి వారికీ ఆవేశం కలిగి మనం కూడా ఈ నాట్యాన్ని నేర్చుకొని, ఆంధ్రుల కీర్తి ప్రతిష్ఠలు నిలబెడదాం అనిపిస్తుంది. అంత ఆవేశ పూరిత నృత్యం ఇది. ఈ తాండవానికి వాయించే మృదంగం, వాయిద్య పద్ధతి వేరుగా ఉంటుంది. ఈ సారి మీ వూరిలో "పేరిణి శివ తాండవం" ప్రదర్శిస్తే తప్పక చూడండి.

# జానపద నృత్యాలు

జానపద నృత్యాలు ఎప్పుడైనా చూశారా?

జాతికి అద్దం పట్టేవే ఈ జానపద కళారూపాలు.

జానపద కళలకు మన ఆంధ్ర పెట్టింది పేరు.

మన ఆంధ్రుల పల్లె జీవితంలో ప్రతి పనిలోనూ ఈ జానపద నృత్యాలు. పాటలు ఒక భాగంగా ముడివేసుకు పోయాయి. పొలం పని చేసే పడుచులు పాటలు పాడుతూ పనిచేస్తారు. అలసట పోగొట్టు కొనేందుకు ఈ జానపదం పాటలు పాడుతూ పని జేయడం ఆనవాయితి.

ఈ జానపద నృత్యాలు అనేకం ఉన్నాయి.

"గరగలు" అమ్మవారి జాతర్లలో నెత్తిపై గరగలు పెట్టుకొని అనేక విధాలుగా విన్యాసాలు చేస్తు నాట్యం చేస్తారు. మీరూ చూసే ఉంటారు కానా?

"వీర నాట్యం" వీరభద్రుని సంబరాలలో వీరనాట్యం చేస్తారు. వీరు నోట్లో అనేక వత్తులతో మండుతున్న కాగడాలు పట్టుకొని భీకరమైన నృత్యం చేసే వీరులు వీరు.

"తోలు బొమ్మలు" తోలు బొమ్మల ఆట ఎప్పుడైనా చూశారా? ఒక తెల్లని తెర వెనుక తోలుతో తయారు జేసి. రంగులు వేసిన బొమ్మలను కదిలిస్తూ. పాటలు పాడుతూ. మధ్యలో హాస్యం చెబుతూ. రామాయణం. భారతం ఇలా ఎన్నో ఎన్నో కథలు ఈ తోలు బొమ్మలతో ఆడుతారు.

ఇవేగాక యక్షగానాలు. చిందులు. పులి వేషం. ఉరుములు. కత్తి సాము. బుట్ట బొమ్మలు. దొమ్మరి ఆట. డప్పులు. రుంజలు, జముకులు. తప్పెట గుండ్లు ఇలా ఎన్నో జానపద కళారీతులు మన ఆంధ్రావనిలో ఉన్నాయి.

# నాట్యం పోషించిన రాజులు

మన ఆంధ్రుల కళలు ఇంత అభివృద్ధి చెందుటకు మూల కారకులు రాజ్యాలను పాలించిన మహారాజులు.

వారు గనుక ఆ రోజులలో కళలను పోషించ కుంటే, ఈ నాడు మనకు ఈ కళా సాంప్రదాయాలు ఏమీ మనకు మిగిలి ఉండేవి కావు. మన కళలకు యింత పేరు ప్రతిష్టలు వచ్చి ఉండేవి కావు. కళలను ఆదరించి, కళాకారులను పోషించి, కళాభివృద్ధికి దోహదం చేసిన కొందరు రాజులను గూర్చి తెలుసు కుందాం.

"శ్రీ కృష్ణ దేవరాయలు" అష్ట దిగ్గజాలు అనే ఎనిమిది మంది కవులను పోషించి వారి చేత అనేక గ్రంథాలు వ్రాయించాడు. అనేక మంది నర్తకీమణులను పోషించాడు. నాట్యశాలలు కట్టించి దేవ దాసీలకు భరణాలిచ్చి నాట్యాభివృద్ధికి కృషి చేసిన మహారాజీయన.

"కొమరగిరి" ఈయన కూడా అనేక నృత్య కళా సాంప్రదాయాలను పోషించి ప్రతి సంవత్సరం వసంతోత్సవంలో పోటీలు నిర్వహించి గెల్చిన వారినీ, ఓడిన వారినీ కూడా సత్కరించేవాడు. "నాట్య శాస్త్రముపై వసంత రాజీవం" అనే గ్రంథం వ్రాసాడు.

"రఘునాధుడు" అనేక మంది నర్తకీ మణులను పోషించి దేవాలయాలు కట్టించి నాట్యానికి ఎనలేని సేవ చేసిన మహారాజు. ఈ మహాభావుని ఆస్థానంలో వందల కొలది నాట్య కళాకారిణులుండేవారు.

వీరే కాక ప్రతాప రుద్రుడు, గణపతి దేవుడు, రుద్రమ దేవి, అచ్యుత రాయలు, తానీషా, కొండవీటి రాజులు, గజపతులు, వీరే కాక అనేక మంది జమిందారులు కూడా నాట్య కళాకారులను పోషించి నాట్యాభివృద్ధికి, కళల అభివృద్ధికి ఎనలేని సేవ చేశారు.

ఇలా చెబుతూ ఉంటే ఎందరో, ఎందరెందరో మహానుభావులు చరిత్రలో ఉన్నారు తమ్ముళ్ళూ!

# ప్రసిద్ధ నర్తకీమణులు

చెల్లాయిలూ!

ప్రతి రాజాస్థానంలోనూ, దేవాలయంలోనూ నర్తకీ మణులుండేవారు. వారు అనేక శాస్త్రాల్లో పాండిత్యం సంపాదించేవారు. వారు పండిత పామరుల హృదయాలను తమ నాట్య కళా నైపుణ్యంతో రంజింప జేసేవారు. వారిలో కొంత మందిని గూర్చి చెబుతాను. వింటారా?

కుప్పాయి : శ్రీ కృష్ణ దేవరాయలి ఆస్థాన నర్తకీమణి. మహా పండితురాలు. అష్టదిగ్గజాలనే మహా పండితుల, రాజుల, తిమ్మరుసు వంటి పండితుల మన్ననలు అందుకొన్న కళాకారిణి.

మాచల్‌దేవి : ప్రతాపరుద్రుని ఆస్థాన నర్తకి. ఈమె తన వంశ చరిత్రనే యక్షగానం ఆడించి, చూసి ఆనందించింది. అంతటి ఘనురాలు.

లకుమ : కొమరగిరి రెడ్డి రాజు ఆస్థానంలో నర్తకీమణి, ఈమె సహకారంతో కొమరగిరి నాట్యంపై ఒక గ్రంథం వ్రాసాడు.

భాగామతి : గోల్కొండ పాదుషా వారిని తన నాట్యంతో మెప్పించి, ఆయనను పెండ్లి ఆడి, తన పేర భాగ్యనగరం అనే మహా పట్టణాన్ని నిర్మింప జేసింది. అదే నేటి మన రాష్ట్ర రాజధాని హైదరాబాద్.

తారామతి : తానీషా ప్రభువుల ఆస్థాన నర్తకి.

ముద్దు చంద్రలేఖ : శ్రీ రఘునాథ రాయల ఆస్థాన నర్తకి. పగటి దివిటీలు, వందిమాగతులతో రాజుగారి ముత్యాల పల్లకిలో రాజాస్థానానికి వెళ్ళిన "ఘన పండితురాలు."

వీరే కాక యింకా తిరు వెంకట మాణిక్యం, మీనాక్షి, కామాక్షి, పెండేల నాగమ్మ, గంగమ్మ, రూపవతి, శశిరేఖ, లోకనాయకి, భాగీరధి ఇలా ఎందరో నర్తకీమణులు పండితుల, రాజుల, చక్రవర్తుల, జమిందారుల, సామాన్యుల ప్రశంశలందు కొన్నారు.

చూశారా చెల్లాయిలూ మన నాట్య కళాకారిణుల ప్రతిభ.

# నాట్యశాస్త్ర వేత్తలు

నాట్య శాస్త్రంపై గ్రంథాలు రచించిన అనేక మంది మహానుభావులలో కొందరు ముఖ్యుల గూర్చి తెలుసుకుందాం.

భరతుడు :– ఈయన శ్రీరాముని తమ్ముడు కాదు. శకుంతలాదుష్యంతుల కుమారుడూ కాదు. భరతుడనే ముని. సుమారు 2 వేల సంవత్సరాలకు పూర్వం మన దేశంలో జీవించిన మహర్షి. ఈయన "నాట్యశాస్త్రము "అనే పెద్ద గ్రంథం వ్రాశాడు.

నందికేశుడు :– ఈయన మన ఆంధ్రుడు. నాట్యశాస్త్రంలో ప్రసిద్ధిపొందిన "అభినయ దర్పణం" "భరతార్ణవం" అనే గ్రంథాలు వ్రాశాడు. నాట్యాచార్యులకు అతి పూజ్యనీయ గ్రంథం "అభినయ దర్పణం".

జాయప :– సుమారు వేయి సంవత్సరాలకు పూర్వం నాట్యం ఎలా ఉండేదో దాన్ని గూర్చి "నృత్త రత్నావళి" అనే గ్రంథం రచించాడు ఈ సేనాధిపతి. విలువిద్యతోపాటు, నాట్యాభ్యాసం చేసిన నాట్య. యుద్ధ వీరుడు జయపసేనాని.

సారంగదేవుడు :– "సంగీత రత్నాకరం" అనే గ్రంథాన్ని ప్రాంతీయ దేశి సాంప్రదాయ నృత్యాలను గూర్చి వ్రాశాడు.

కొమరగిరి :– కొండవీడు నేలిన రాజు "లకుమ" అనే ఆస్థాన నర్తకి సహాయంతో "వసంత రాజీయం" అనే నాట్య గ్రంథాన్ని వ్రాశాడు. దురదృష్టవశాత్తు మనకు లభించలేదు.

ఇంకా విద్యానాధుడు, సింగ భూపాలుడు ఇలా అనేక మంది మహా యోగులు, మహాపురుషులు, మహారాజులు పూర్వ కాలంలో నాట్యంపై గ్రంథాలు వ్రాసారు. మనందరి కొరకు.

చూశారా తమ్ముళ్ళూ! వారు ఆనాడు వ్రాసి ఉండకపోతే నాట్యంలోని మెలకువలు మనకు ఈనాడు తెలిసేవి కావు.

# ఈనాటి నాట్య శాస్త్రవేత్తలు

తమ్ముళ్ళూ, చెల్లాయిలూ !

పూర్వం నాట్యంపై గ్రంథాలు వ్రాసిన వారిని గూర్చి తెలుసుకున్నాం. కానీ,

ఈనాడు నాట్యశాస్త్రంపై కొన్ని గ్రంథాలు వ్రాశారు కొందరు.

కొందరు సంస్కృత గ్రంథాలను తెనుగులోనికి అనువదించారు.

వారినిగూర్చి తెలుసుకుందామా?

శ్రీ నటరాజ రామకృష్ణ : నాట్య కళాకారునిగా, నాట్యశాస్త్ర పరిశోధకునిగా, నాట్యాచార్యునిగా అనేక భాషలలోని నాట్య గ్రంథాలను తరచి, మరే ఇతర భాషలోనూ లేనన్ని గ్రంథాలు నాట్యంపై రచించిన మహానటమూర్తి. ఈయన రచనలు మూడు భాగాలుగా ఉంటాయి.

1. బాలురకు, బాలికలకు నాట్యాభిలాష పెంపొందించేవి.
2. నాట్యం అభ్యసించే విద్యార్థులకు ఉపయోగపడేవి.
3. నాట్యాచార్యులకు ఉపయోగపడేవి.

ఈయన గ్రంథాలకు అనేక జాతీయ, రాష్ట్రీయ బహుమతులు లభించాయి. అందుకే ఈయనను "నాట్యకళా పితామహుని"గా ప్రపంచం కొనియాడుతుంది.

శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావు : అతి సామాన్యులకు కూడా అర్థం అయేలా భరతుని నాట్య శాస్త్రాన్ని తెలుగులోనికి అనువదించారు ఈయనే.

శ్రీ జమ్మలమడక మాధవ రామశర్మ : ఎన్నో గ్రంథాలు సంస్కృతం నుండి తెలుగులోనికి అనువదించారు. నృత్త రత్నావళి, నాట్య శాస్త్రాలను తెలుగులోనికి అనువదించారు.

వీరు కాక శ్రీ వోతుకూచి సుబ్రహ్మణ్యం, శ్రీ మానవల్లి రామకృష్ణయ్య, వేదాంతం పార్వతీశం, సి. ఆర్. ఆచార్యా ఇలా అనేక మంది ఈ నాటి నాట్య శాస్త్ర వేత్తలు, నాట్యంపై అనేక గ్రంథాలు రచించారు, రచిస్తున్నారు కూడా.

# నృత్య సంగీత రచయితలు

చెల్లాయిలూ!

నాట్యానికి కావలసిన సంగీతం రచనలు చేసిన మహాయోగులు, మహాను భావులు ఎందరో ఉన్నారు.

వారిలో అతి ముఖ్యమైన వారిని గూర్చి చెబుతాను.

అన్నమాచార్యులు : ఏడుకొండల వెంకటేశ్వరుని దివ్యలీలలను సంగీత రచనలు చేసి మనం నాట్యం ఆడటానికి వీలుగా పాటలు వ్రాసారు.

త్యాగరాజు : తన సంగీత రచనలతో కర్నాటక సంగీతానికి జీవంపోసిన అపర బ్రహ్మ అనేక కీర్తనలు రచించి అభినయానికి, నాట్యానికి జీవం పోశారు.

నారాయణతీర్థులు : ఈయన రచించినవే తరంగాలు. పున్నమి చంద్రుని చూచి పొంగే కడలి తరంగాలవలే ఈయన రచనలు ఉంటాయి. అందుకే వాటిని తరంగాలు అంటారు. భావ ప్రకటనకు, నాట్య విన్యాసాలకు అనువయినవి తరంగాలు.

సిద్ధేంద్రుడు : కూచిపూడి నాట్యానికి మూల పురుషుడు. కృష్ణ, సత్యభామల ప్రణయ కలహం ఒక ప్రబంధంగా రచించి కూచిపూడి నాట్యాన్ని వెలుగులోనికి తెచ్చిన మహాయోగీంద్రుడు.

క్షేత్రయ్య : క్షేత్రయ్య వ్రాసిన పదాలు, నాట్యాభినయానికి ముఖ్యం అయినవి. ఈయన పదాలు రచించకుండా ఉంటే ఆంధ్రుల అభినయానికి ఇంతటి కీర్తి ప్రతిష్టలు వచ్చి ఉండేవి కావేమో?

సభాపతయ్య, సారంగపాణి వీరిరువురూ కూడా పదాలు రచించారు.

వీరేకాక ఆది శంకరాచార్యులు, జయదేవుడు ఇలా ఎందరో ఎందరెందరో మహానుభావులు నాట్య సంగీతానికి కావలసిన రచనలు చేసి చరితార్థులైనారు

# ఆలయ శిల్పాలు

చిన్నారి చెల్లాయిలూ, చిన్ని చిన్ని తమ్ముళ్ళూ!
ఆలయానికి వెళ్ళినపుడు శిల్పాలను చూశారా?
మనకు ముందుగా చిరునవ్వుతో, వివిధ భంగిమలలో స్వాగతం చెప్పేవి
శిల్పాలే కదూ!
ఎప్పుడో, ఎవరో తెలియని అజ్ఞాత శిల్పి మలచిన అందమైన శిల్పాలు అవి.
వాటి దగ్గరకు వెళ్ళి చూశారా?
అవి మిమ్మల్ని రమ్మని ఎప్పుడూ పిలవలేదా?
ఈ సారి దేవాలయానికి వెళ్తే ఆ శిల్పాలను పరీక్షగా చూడండి.
అవి సజీవ మూర్తులై మిమ్మల్ని ఆహ్వానిస్తాయి.
కొన్ని శిల్పాలు కాలి మువ్వలు కదిపి నాట్యం చేస్తాయి.
కొన్ని పాటలు పాడుతాయి, కొన్ని వాయిద్యాలు వాయిస్తాయి.
ఆ శిల్పాలను పరీక్షగా చూస్తే కొన్ని వందల, వేల సంవత్సరాల నాటి
నృత్యాన్ని, ఆనాటి సంస్కృతినీ, మనం అర్థం చేసికొనవచ్చును.
అందుకే తమ పేరు శాశ్వతంగా ఉండేందుకే
మహారాజులు ఎంతో ధనం వ్యయం చేస్తే
ఎందరో శిల్పులు తమ నైపుణ్యాన్ని, చమటను, రక్తాన్ని వ్యయంచేసి ఆ
శిల్పాలను తీర్చి దిద్దారు.
ఆ శిల్పాలకు ఆధారం నర్తకీమణులే!
వారిని ఊహించి, చూచి శిల్పాలకు ప్రాణం పోస్తారు శిల్పులు.
అర్థం అయిందా శిల్పాలకు, నాట్యానికి ఎంత సంబంధం ఉందో!

# లయం

నాట్యానికి అతి ముఖ్యమయింది లయ.

సృష్టిలోని ప్రతి కదలికలో లయ ఉంది.

వీచే గాలిలో, ప్రవహించే నదీ కెరటాల్లో, సముద్ర తరంగాల్లో ఇలా ప్రతి కదలికలో లయ ఉంది.

ఆ లయను గుర్తించే పద్ధతి చెబుతాను వినండి.

మీ ఇంట్లో గోడకు గడియారం ఉంది కదూ

ఆ గడియారం క్రింది "లోలకం" అటూ, ఇటూ ఊగుతుంది అవునా?

అది కదిలే పద్ధతిలోను గానీ, మధ్య దూరంలో గానీ మార్పు ఉండదు.

హెచ్చు తగ్గులుండవు. ఒకే విధంగా టిక్కు-టిక్కు అని అంటుంది.

అదే లయ, అంటే

అలాగే

గుఱ్ఱం పరుగు పెట్టేటప్పుడు వచ్చే శబ్ధంలోనూ, రైలు పరుగు పెట్టే శబ్ధంలోనూ లయ సులభంగా తెలుస్తుంది.

రైలు చూడండి

చిక్-బుక్, చిక్-బుక్ అని ఒకే విధంగా పలుకుతుంది. అదే లయ అంటే.

అర్థం అయిందా తమ్ముళ్ళూ?

లయ లేకుంటే నాట్యం లేదు.

# మృదంగం

తమ్ముళ్ళూ :

మృదంగం అనే వాయిద్యం నాట్యానికి చాలా ముఖ్యం.
మరి ఆ మృదంగం ఎలా పుట్టిందో తెలుసుకుందామా!
శివుడు త్రిపురాసురులనే రాక్షసులను చంపి.
విజయ సూచకంగా తాండవం చేస్తుంటే,
ఆయన పాదాలు తాకి మూడులోకాలు నుండివచ్చే శబ్ధాలను
బ్రహ్మ దేవుడు వినీ. మృదంగాన్ని సృష్ఠించి.
"తా_ధి. తోం. నం" అనేలయనూ,
తకతరికిట కత అనే జతిని
తధిగిణతోం అనే ముక్తాయినీ సృష్టించి. ఆశబ్ధాలను ఆధారంగాచేసి
తొలుదొలుత శివుని కుమారుడయిన వినాయకునికి నేర్పించాడు
ఆనాటి నుండి మృదంగం.
ఆమృదంగం నుండి. అనేక వాయిద్యాలు సృష్టించ బడ్డాయి.
చూశారా తమ్ముళ్ళూ!
నాట్యానికి ఉపయోగించే వాయిద్యానికి కూడా ఎంత చరిత్ర ఉందో!

# నట్టువాంగం

తమ్ముళ్ళూ!

నట్టువాంగం అంటే నృత్యానికి సరిపడగా. తాళం వేయడం నట్టువాంగం చేసేవారిని తాళధారి అంటారు.

సాధారణంగా నృత్యం నేర్పిన గురువే నట్టువాంగం చేస్తారు.

పాటమధ్యలో. చివరనూ

తక తధిగిణతోం

తధిగిణతోం

ధిగిణతోం

గిణతోం ఇలా అనేక జతులు లయకు. తాళానికి సరిపడేలా అంటూ తాళం వేస్తారు.

నృత్యం అడే విధానం అంతా తాళధారి పైనే ఆధారపడి ఉంటుంది. నర్తకుని కాలిలో పలికే ప్రతి శబ్ధం తాళంలో పలకాలి. అందువల్లే నట్టువాంగం చేయడం కష్టం. ఈ నట్టువాంగం చేసే తాళాలు వేరు. ఒకటి కంచుతోనూ. రెండవది ఇత్తడితోనూ తయారు చేయబడి ఉంటాయి.

నట్టువాంగం లేకుంటే నృత్యప్రదర్శనం లేదు.

# గాత్రం

చెల్లాయిలూ,

"గాత్రం" అనగా మన గొంతుకలో నుండి వచ్చిన శబ్దం. మీరు ఏదైనా నృత్య ప్రదర్శనం చూశారా?

ఆ ప్రదర్శనలో నాట్యమాడే వారిని కుడివైపున వాయిద్యాలు వాయించే వారి మధ్యలో కూర్చొని పాట పాడేవారు ఉంటారు. అవునా?

నాట్యానికి నర్తకి ఎంత ముఖ్యమో? పాట అంతే ముఖ్యం పాట అందంగా విన సొంపుగా లేకుంటే

నర్తకి ఎంత బాగా ఆడినా ఆ నృత్య ప్రదర్శనం రక్తి కట్టదు.

అందుకే నృత్యానికి పాట పాడే అమ్మాయిగానీ, అబ్బాయిగానీ తప్పని సరిగా సంగీతం నేర్చుకొని ఉండాలి.

నాట్యానికి పాడే పద్ధతి వేరుగా ఉంటుంది.

లెక్క ప్రకారం పాడాలి, నాట్యం ఆడేవారిని చూస్తూ అభినయానికి తగ్గట్టుగా పాడాలి.

అప్పుడే ఆటకూ, పాటకూ అందం చేకూరుతుంది.

పూర్వం నర్తకీమణులు తామే పాడుకుంటూ ఆడేవారు. ప్రస్తుతం పాడుతూ నాట్యం ఆడే నర్తకీమణులు లేరు.

# సభావందనం

నాట్యం ప్రారంభించే ముందుగా,

నాట్యం ముగించిన అనంతరం సభావందనం చేయాలి.

ఇది అనాదిగా వచ్చిన ఆచారం

అయితే చెల్లాయిలూ సభావందనం అంటే ఏమిటంటే?

నాట్యం చేసేవారు దేవతలకూ, గురువుకూ, తల్లిదండ్రులకూ, భూదేవికి,

చూసే పెద్దలందరికీ నమస్కరించడం అంటే సభలో ఉన్న వారందరికి

వందనం చేయడమే సభా వందనం అన్నమాట.

అది ఎలా చేయాలంటే?

మన హిందూ ఆగమ శాస్త్ర ప్రకారం ప్రక్క పేజీలో బొమ్మలు

చూడండి. అలా చేయాలి.

1వ బొమ్మ తలపై చేతులుంచి నమస్కారం చేస్తే దేవతలకు

2వ బొమ్మలోలాగ ముఖానికి ఎదురుగా నమస్కారం చేస్తే

గురుదేవులకి, తల్లిదండ్రులకు

3వ బొమ్మలో లాగ గుండెల కెదురుగా నమస్కారం చేస్తే

పెద్దలకూ వర్తిస్తుందన్న మాట.

చూశారా సభావందనం చేసే నాట్య కళాకారుడు ఎంతమందికి

నమస్కారం చేస్తున్నాడో.

# అసంయుత హస్తాలు

చెల్లాయిలూ!

అసంయుత హస్తాలంటే ఒక్క చేతితో చూపే నాట్యంలో ఉపయోగించే ముద్రలు అన్నమాట.

ఇవి మొత్తం 28 అని చెబుతారు.

1. పతాకము
2. త్రిపతాకము
3. అర్ధ పతాకము
4. కర్తరీ ముఖము
5. మయూరము
6. అర్ధ చంద్రుడు
7. అరాళము
8. శుక తుండము
9. ముష్టి
10. శిఖరము
11. కపిత్థము
12. కటకాముఖము
13. సూచి
14. చంద్రకళా
15. పద్మకోశము
16. సర్ప శీర్షము
17. మృగ శీర్షము
18. సింహ ముఖము
19. లాంగూలము
20. సోలపద్మము
21. చతురము
22. భ్రమరము
23. హంసాస్యము
24. హంసపక్షము
25. సందంశము
26. ముకుళము
27. తామ్రచూడము
28. త్రిశూలము

1 బొమ్మ – కలువపువ్వు పెట్టిన హస్తం పద్మకోశము
తుమ్మెదగా పెట్టిన హస్తం భ్రమరము

2 బొమ్మ – శిఖరము కొండలు అభినయించడానికి

3 బొమ్మ – త్రిశూలం శివుని చేతిలో త్రిశూలం

ఈ 28 హస్తాలతో అనేక రకాల ఉపయోగాలుంటాయి నాట్యంలో అర్థం అయిందా!

# సంయుత హస్తాలు

ఒక్క చేతితో చేసే ముద్రలు చెప్పాను.

మరి రెండు చేతులలో అభినయించే ముద్రలను "సంయుత హస్తాలంటారు." ఇవి మొత్తం 24 ఉన్నాయి.

| | | | |
|---|---|---|---|
| 1. | అంజలి | 13. | చక్రము |
| 2. | కపోతము | 14. | సంపుటము |
| 3. | కర్కటము | 15. | పాశము |
| 4. | స్వస్తికము | 16. | కీలకము |
| 5. | డోల | 17. | మత్స్యము |
| 6. | పుష్పపుటము | 18. | వరాహము |
| 7. | ఉత్సంగము | 19. | కూర్మము |
| 8. | శివలింగము | 20. | గరుడ |
| 9. | కటవర్ధనము | 21. | నాగబంధం |
| 10. | కర్తరీస్వస్తికము | 22. | ఖట్వా |
| 11. | శకటము | 23. | భేరుండము |
| 12. | శంఖము | 24. | అవహిత్థము |

ప్రక్క పేజీలో బొమ్మలు చూడండి.

1వ బొమ్మలో అంజలి – అంటే నమస్కారము

2వ బొమ్మలో గరుడ – గ్రద్ద

3వ బొమ్మలో శివలింగము – శివలింగము

# భారత దేశంలో నర్తన రీతులు

తమ్ముళ్ళూ! చెల్లాయిలూ!!
ఇక ఆఖరుగా నేను చెప్పే విషయం వింటారా?
ఎందుకమ్మా అంత తొందర?
చెప్పేస్తున్నాను. సావధానంగా వినండి.
మన ఆంధ్ర దేశంలోని నాట్యరీతులు గూర్చి చెప్పాను.
ఇప్పుడు భారతదేశంలోని అనేక నాట్య సాంప్రదాయాలు ఉన్నాయి.
వాటిని గూర్చి చెబుతాను.
మన ఆంధ్రలో ఆంధ్రనాట్యం. పేరిణి. కూచిపూడి ఉన్నాయ్ కదూ
అలాగే
అస్సాంలో "అంకియానట్" అనే నాట్యం ఉంది.
తమిళనాడులో "భరత నాట్యం" గూర్చి మీకు తెలుసు.
మళయాళ దేశంలో "కధకళి"
ఒరిస్సాలో "ఒడిస్సి నృత్యం"
ఉత్తర హిందుస్తాన్‌లో "కధక్"
ఇంకా "చౌ" అనే నృత్యం సిరై కేళాలో ఉంది.
వీటిలో అనేకంగా పురుషులు చేసే నాట్యాలుంటే
కొన్నింటిని మాత్రం స్త్రీలు నర్తిస్తారు!
కొన్నింటిలో అధిక సంఖ్యలో నర్తకులు పాల్గొంటే
కొన్నింటిని ఒక్కరు మాత్రమే నాట్యం చేస్తారు.
ఇలా ఒక్కో ప్రాంతంలో ఆ ప్రాంత నాగరికత. ఆచారం
సాంప్రదాయాలలో నాట్యాలు మారాయి.
అంతేకాక ముఖ్యంగా
ఆప్రాంత ప్రజల అభిరుచులను బట్టి ఇలా వేరువేరుగా
ప్రచారం అయ్యాయి.
ప్రజాదరణ పొందాయి. పొందుతున్నాయి.
కానీ
భారత దేశంలోని అన్ని నాట్యాలు హిందువులవే
భారత దేశంలో అన్ని నాట్యాలు దేవతలపై నర్తించేవే
భారత దేశంలో అన్ని నాట్యాలకూ ఆధారం నాట్యశాస్త్రమే.
అర్థం అయిందా చిరంజీవులు.

# తుది పలుకు

ఈ చిన్ని గ్రంథానికి తన విలువయిన ఆశీస్సులు అందించిన మా గురుదేవులు, నాట్య కళా పితామహులు "భరత కళా ప్రపూర్ణ"డా॥ నటరాజ రామకృష్ణ గారికి
తొలిపలుకు వ్రాసిన ప్రముఖ కవి శ్రీ పడాల రామారావు గారికి
తప్పొప్పులు సవరించిన "శాంతిశ్రీ" బొత్సకవి గారికి
గ్రంథానికి వెలుగు జూపిన శ్రీమతి శారదా రామకృష్ణకు
అందంగా అచ్చు వేసిన ఆంధ్రశ్రీ ప్రింటర్స్, పడాల వీరభద్రరావు గారికి
నాకు అన్ని విధాల సహకరించిన నా మిత్ర బృందానికి
హృదయ పూర్వకంగా కృతజ్ఞతలు తెల్పుకుంటున్నాను.

—రచయిత

• • •

చిన్నారి తమ్ముళ్ళూ!
చిన్ని చిన్ని చెల్లాయిలూ!
ఈ చిన్ని గ్రంథాన్ని చదివారు గదూ!
ఈ గ్రంథంలో అతి ముఖ్యమయిన కొన్ని అంశాలు మీకు నాట్యంపై
తెలియ జెప్పాలనే ఆరాటంతో
మీ అందరికీ అర్థం అయ్యేలా వ్రాసాను.
ఔనా!
త్వరలో మరో కానుక "ఆంధ్రుల – నృత్యకళ" అనే గ్రంథాన్ని
అందిస్తాను.
మీరు కూడా నాట్యం నేర్చుకొని, నాట్య ప్రదర్శనలివ్వాలి.
నాట్యంపై పరిశోధనలు చేసి పూర్వపు నాట్యాలు వెలుగులోనికి
తేవాలి. నాట్యంపై గ్రంథాలు వ్రాయాలి. అదే నా ఆకాంక్ష.
ఈ గ్రంథంలో మీ సందేహాలు నాకు వ్రాసి తెలుసుకోండి.
ఈ గ్రంథంపై మీ అభిప్రాయాన్ని మీ చిన్నారి చేతులతో
ఈ అన్నయ్యకు ఒక జాబు ద్వారా తెలియజేయండి.
ఈ అన్నయ్యను మరచిపోరు కదూ.

మీ అన్నయ్య
దుర్గాప్రసాద్

మత ఛాందసవాదపురంగులు
హత్తించిన మూర్తుల తీరిది -

ఈదేశం ఏమవుతున్నా
సరిహద్దులు చెరిపేస్తున్నా
అసమర్థులు కుర్చీలెక్కి-
భోక్తలుగా విజృంభిస్తే-

భవితవ్యం ఏమవుతుంది?
భారతి పరువేమవుతుంది??

సైనికులకుతప్పని మరణం
సామాన్యుల బ్రతుకుల నిధనం
నిలదీసిన వాళ్లకు దండన
కలిసొచ్చిన వాళ్లకు దీవన!

ఏమవుతుందీ దేశం
ఎటు తప్పును జాతి వినాశం??
ముష్కరులను లెక్కించకనే
మౌనంగా జాతిని కాచే
సైనికులకు జేజే లివిగో.... ...
అభినందన మాలిక లివిగో....

(అమరజవానులకు అశ్రుతర్పణంతో)
(7.7.1999)



# హృదయాంజలి

స్వతంత్ర భారతి గుండె కవాటం
పరిరక్షించే వీరజవాన్లకు
అందిస్తున్నా నా హృదయాంజలి
స్నిగ్ధరసామృత పరిపూర్ణాంజలి!!

కరుడుగట్టిన ముష్కరమూకల
నుక్కడగించే స్థిరచిత్తంతో
కర్తవ్యానికి అంకితమౌతూ
మాతృభూమి పరిరక్షణకోసం-

తమ ప్రాణాలను గడ్డిపోచగా
త్యాగం చేస్తూ శత్రుమూకలను
వెదకి వెదకి యమపురికి పంపుతూ
దేశప్రజల ప్రాణాలు నిల్పుతూ

అమరవీరులై పురోగమించే
ధీరోదాత్తులు - చైతన్యాత్ములు!!

నిస్వార్థంతో - నిజాయితీతో
నిష్కల్మషులయి - నిర్భీతులయి
చెలరేగే మన వీర జవాన్లకు
అందిస్తున్నా నా హృదయాంజలి--

కడదాకా తన కన్నతేలనే
సేవించే బహుధన్యజీవులు;
తల్లినేలకై తనువులు విడచే

దేశభక్తులు - పుణ్యమూర్తులు!!

వీరజవానులు ధీరమూర్తులు
మనలను గాచే వారి కోసమ్మై
అందిస్తున్నా నాహృదయాంజలి
స్నిగ్ధ రసామృత పరిపూర్ణాంజలి!!! (18.7.1999)

# దేశభక్తి

పరాయిపాలనలో
రెండు దశాబ్దాలుగా కుళ్లికుతాబులయ్యాక-
సహనం ఆసాంతం చచ్చాక,
గత్యంతరం లేని పరిస్థితుల్లో
వెన్నలా
అప్పుడెప్పుడో ఉద్భవించింది
దేశభక్తి!
ఇండియాలో
చరిత్రకాలం నుంచీ
అరుదుగా లభ్యమయ్యే
ఆయుర్వేద వనమూలిక ఇది!
అక్కడో మొక్క - అక్కడో మొక్కగా కనిపించి
అకస్మాత్తుగా
ఏమృగరాజు ఆకలిదప్పికలకో
ఆహుతి అయిపోతుంటుంది-
అంభికాలం నుంచి

అయూబ్‌ఖాన్‌ని యుద్ధానికి రమ్మని
అదే టెక్నిక్‌లో ఆహ్వానించిన కాలం వరకు-
భారతదేశం బల్లపురుగానే ఉంది!
ఎక్కడో ఒకటీ, అరా
దేశభక్తి వృక్షాలు మొలిచినా
అవి విత్తనాలు చల్లకుండా
సమూలంగా
భూకంపానికి తలలువంచి కూలిపోయాయి!!
కనుమరుగైపోయిన
వేదశాఖల్లాగ
దేశభక్తుల ఆనవాళ్లుకూడ
మళ్లీ కన్పించక పోవచ్చు-
రాజకీయ రంథిలో పడిన బడా నాయకులకే
స్వదేశీ- విదేశీ భేదం నశించిపోయి
అంటు-మైల అంటని నిర్వికారస్థితి
వచ్చేసింది!
తనపనికి అడ్డురాకుండా
తన లాభానికి సాయపడితే
ఏదేశీయుడైనా సరే అభ్యంతరం లేదు!
కాశ్మీర్ పూర్తిగా అన్యాక్రాంతమైనా
వారికేం పర్వాలేదు-
ఏభైయేళ్లేకాదు!
ఇంకో వందేళ్లు పాలించినా
ఇరవై ఎనిమిది రాష్ట్రాలు

సింగపూర్‌లోనో, కీన్యాతోనో
సహారాలోనో కలిసిపోయినా
వారి సింహాసనం భద్రంగా ఉంటే-
వీర జవానులు ఎందరేల్లినా
శతవర్షాధిక చరిత్ర కల్గిన
రాజవంశ్యులకు ఢోకా ఉండదు!
పేరుకు ప్రజాస్వామ్యమే అయినా
దేశాన్ని టోకున కొనేసిన
రాజవంశానికి
పోస్ట్ డేటెడ్ చెక్‌మాదిరిగా
నిరక్షరమూకలు ఏభైయేళ్లక్రితమే
శాశ్వత పవరుపట్టా రాసిచ్చేశారు!
మనది
దొరలతరహా ప్రజాస్వామ్యం కాదు
దొంగల తరహా
ఏకవంశ రాజస్వామ్యం!
వీలునామా రాయించుకునేందుకు
తడవ తడవకీ వేలకోట్ల ఖర్చెందుకు?
ఎమర్జెన్సీ క్వీన్‌లాగ
ఇండియా నాకు ఎప్పుడో దొరికిందంటే పోలా?
ఎన్నికలొక పబ్లిక్ స్టంటు
లాలూజీ ఎరిగిన కిటుకు!! (15.8.99)



# భారత్ మాతాకీ జై

సరిహద్దుల రక్షణకోసం
అసువులనే త్యాగం చేసి
అమరులుగా వెలుగొందారు
కార్గిల్‌లో వీర జవానులు!

చలిపులికే మాత్రం జంకక
తమ  రక్తం గడ్డకట్టినా
తిన తిండీ దొరకకపోయిన
కునుకన్నది లేనే లేక
శత్రువులను గురి చూశారు
సరిహద్దులు కాపాడారు.,
తను పుట్టిన నేల తల్లిని
సేవిస్తూ కనుమూశారు!!

మీ సేవలు అజరామరము
మీ త్యాగం నిరుపమానము
మీ స్ఫూర్తియె సంస్మరణీయం
మీ దీక్షయె ఆచరణీయం-

మీ కథలను విన్నాకయినా
మనుషులలో మార్పువచ్చునా?
మీ నడకను చూచాకయినా
నేతలకొక నీతి కల్గునా?

నఖశిఖ పర్యంతముగా
స్వార్థమనే రోగం నేడు
ప్రతివాణ్ణీ కదలిస్తోంది
తనవైపే నడిపిస్తోంది!!

అయినా ఈ దేశ రక్షణే
తమప్రాణం కన్నా ఎక్కువ
అని చాటిన అమరజవానుల
పంథాయే మనకాదర్శం!

అని ఎందరు ఆచరింతురు?
తననేలను గౌరవింతురు?
తనకోసం కన్నతల్లినే
అమ్మేసే ఘనులే అందరు!
పిసరైనా పొరుగువాడికి
సహకారం ఇవ్వని వాడికి
జాతీయత గుర్తు వచ్చునా?
త్యాగం అణువైన అబ్బునా?
ఈ దేశం నాదేనన్న
అభిమానం పుట్టుకొచ్చునా?
"నాదేశం కోసం నేను
నిలబడతాన"ను దీక్షకల్గునా?

మన జాతికి ద్రోహం చేస్తూ
పరజాతిని నెత్తిన మోస్తూ
తమలాభం కోసం నడిచే
నాయకులకు తెల్వికల్గునా?

మహనీయులు చేసిన త్యాగం
మనకెందుకు లెమ్మని మరచి
ఈనాడు విదేశీ వనితకు
వంగి సలాం కొడుతున్నారు!!
పరజాతీయులపట్ల
చూపించే అభిమానంలో
నిండా తమ స్వార్థమున్నది
తమలాభమె దాగి ఉన్నది-

ప్రజలేమీ తెలియని వాళ్లని
ఎటు తోలితె అటు వెళ్తారని
ఈనాయకులకు గట్టి నమ్మకం
తామే మొనగాళ్లని గర్వం!!

ఈ మూర్ఖత వదిలించాలి
ప్రతివారికి కన్ననేలపై
మమకారం కలిగించాలి
సైనికులుగ నడిపించాలి!!

ఆనాడే భరతమాతకు
నిజమైన స్వతంత్రదినం!
ఆనాడే జాతి భవితకు
స్వర్ణోత్సవ పర్వదినం!!

భారత్ మాతాకీ జై
అమరజవాన్‌కీ జై (15.8.1999)



F7

# ధర్మం చెరచకు!

కురుక్షేత్ర రణరంగానికి
కొత్త సమీకరణాలు జరుగుతున్నాయి!
ఈ సారి పార్థసారథి లేకుండానే
జగన్నాటకం రక్తి కట్టబోతోంది-
హిందూదేశంలో
మతం పేరెత్తరాదని
'లౌకిక తత్త్వం' అనే జగన్మోహినిని
ప్రతిపాదించింది రాజ్యాంగం!
అది ఆసరాగా చేసుకుని
ఇండియాలో హూణులు జరిపే
మత మార్పిడులకు పోప్ కితాబులు!!
ఆంగ్లం మనపైన రుద్దితే
మన సంస్కృతి సర్వనాశనం
కాగలదని ఊహించాడు
టామస్ బాబింగ్టన్ మెకాలే-
నిరుద్యోగ సమస్యాపరిష్కారానికి
స్వావలంబనకు,
పారిశ్రామిక ప్రగతికి
హిందూ ధర్మంలో వృత్తి విద్యలతో ఏర్పడిన
కుల కట్టుబాట్లని
హూణ సంపర్కంతో చెలరేగిన
పండిత ముష్కరులు

సమూలంగా నాశనం చేయాలని
కంకణం కట్టుకున్నారు!
వేలాది వేదశాఖల్ని
నామరూపాలు లేకుండా తుడిచిపెట్టి
పోప్ ప్రశంసలు పొందుతున్నారు-
ధర్మసంస్థాపనార్థాయ
సంభవామి అన్న పెద్దమనిషి
అడ్రస్ లేకుండా పోయాడు!
ఆధ్యాత్మిక విద్యారహస్యాల్ని
అణువణువునా ఛేదించి
పరమాత్మస్వరూపాన్ని
సాక్షాత్కరింపజేసి
జన్మసాఫల్యాన్ని అందించే
భారతీయ ధర్మం
ముష్కరమూకల వితండవాదాలలోపడి
కాసింతైనా నీడలేక
నీరసపడిపోతోంది!
వేలయేండ్లుగా యావత్ప్రపంచానికి
విజ్ఞాన భిక్ష నందించిన
వైదిక విద్య
పోషించే నాథుడులేక
ఆశించే అభ్యర్థులు లేక
అంతర్హిత మౌతోంది!
దాని నందుకోలేని

మూర్ఖజాతి విలపించాలిగాని
ఆర్షవిద్యకేం నష్టంలేదు-
ఐహిక లాలసలోపడి
ఆముష్మికమార్గం మరచి
వేదభూమి విలువలు విడచి
పనికిరాని పనులను తలచి
పతనమయే భారతీయుడా!
ఇకనైనా కళ్లు తెరవరా-
నీ విద్యలు ప్రోగుచేయరా;
నీ జాతికి విలువ తెలియరా-
నీ మతమొక మతము కాదురా!
సంకుచితపు నీతికాదురా!!
పదిమందికి పరమాత్మునితో
సన్నిహితం కలిగించేదిరా-
ఈతత్త్వం తెలియని మూర్ఖులు
నిందిస్తారది సరికాదురా!
హైందవమొక ధర్మమార్గము
సహనంతో నిండిన దుర్గము
ఓర్పుకు ఒక హద్దుంటుంది-
శ్రుతి మించితే మసి చేస్తుంది!! (జూన్ 1999)



# మహాత్ములు కండి!

ఈరోజుల్లో
మహాత్ముడు కావటమంటే
మాటలతో అయ్యేపనికాదు!
సాక్ష్యం లేకుండా
మర్డరైనా చెయ్యాలి
సారాకాంట్రాక్ట్ చేసి
కోట్లైనా గడించాలి!
మల్టీమిలియనీరో
బ్లడీ మర్డరరో మాత్రమే
మహాత్ములు కాగలరు-
ప్రజాసేవ చేయటమంటే
బాలగంగాధరతిలక్‌లా కాదు!
భగత్‌సింగ్‌లా కాదు;
ఏ విదేశీవనిత బొమ్మనో
ఊరేగించి
దండిగా ఓట్లు దండుకుని
విడవకుండా
అధికార కుర్చీకి అతుక్కుపోతే
బోలెడు ప్రజాసేవ చేసినట్లు!!
అటువంటి వాళ్లకి
పద్మభూషణలు, భారతరత్నలు
బొచ్చెడు బిరుదులు – భోషాణం రూపాయలు!

ఒకవేళ ఏ శనిగ్రహమైనా తన్ని
ప్రజాప్రాతినిధ్యం లభించక పోయినా ఫర్వాలేదు!!
పైవాడి అనుగ్రహం ఉంటే
పైరవీ చేయగల సత్తా ఉంటే-
ప్రజల సొమ్ము తినటానికి
ఏదో గుమ్మం ద్వారా
లైసెన్స్‌బిళ్లకట్టి లోనికి పోనిస్తారు!
ఇక నీ ఆకలికొద్దీ తినొచ్చు-
మహాత్ముడివి కావొచ్చు;
ఇక్కడ ఏదీ ఎవరికీ తప్పుగా అనిపించదు-
వందలకోట్ల జనాన్ని
నీతిమార్గంలో పెట్టగల ఏజెంట్
ఎప్పుడో చచ్చిపోయాడు-
కనుక
నిర్భయంగా నువ్వుమహాత్ముడివి కావొచ్చు!

(జూన్ 1999)

## మతతత్త్వవాదం

భగవద్గీతను ఉటంకించినా
రామాయణసారం పలికినా
పక్కామతతత్త్వంగానే
పలువురు పేర్కొంటారు -
మనదేశం లౌకిక రాజ్యం

కులభేదం లేదంటారు
మతఘోషలు వద్దంటారు
అంతా సమమేనంటారు;

అయినా ఒక చిన్నరహస్యం
కొందరు అధిక సమానం
కొన్నిమతాలే ప్రాణం
వారిని ఏమన్నా ఊర్కోం!

మైనారిటీ రక్షణ కోసం
మతస్వేచ్ఛను కల్పిస్తున్నాం-
ఈకొంచెపు మేలిముసుగులో
మతమార్పిడులను గమనిస్తున్నాం...

నానాటికి హిందూ సంస్కృతి
నీరసపడి నశియిస్తోంది-
పాశ్చాత్యుల ధనబలమతమే
తీవ్రంగా వ్యాపిస్తోంది!
ఇన్నేళ్ల హైందవభూమి
క్రైస్తవముగ మార్పు చెందుతూ
కనిపెట్టే నాథుడులేక
చైతన్యం కోల్పోతోంది-

ఆ మతమని నిరసనకాదు
ప్రజ్ఞాన్విత భగవత్తత్త్వం
బోధించిన హిందూ జ్ఞానం
నశియిస్తే తప్పదు నాశం!!

వేదాన్తప్రసారం తెలిసి
విజ్ఞతతో ప్రవచించగల
పండితులే కరవైపోగా
అన్యమతం వచ్చేస్తోంది-
నీతి నియమాలు విధించి
ఆధ్యాత్మిక సంపద పెంచి
న్యాయం ధర్మాలు వచించి
ఏ మానవమాత్రునికాక
నిజమైన దేవుని గూర్చి
బోధించిన హిందూతత్త్వం
సంఘానికి నేడు అవసరం
లేకుంటే తప్పదు పతనం!! **(జూన్, 1999)**

# సనాతనం

సనాతన హిందూ ధర్మం
చాదస్తాల కలగూరగంపకాదు;
సత్యాన్వేషణ చేసి
సంఘానికి ఋజు ప్రవర్తనను
నైతిక విలువలను
ప్రసాదించిన మహనీయ తత్త్వం!
మనిషి మనుగడకు అవసరమైన
సకలసౌకర్యాలను అమర్చిన
సాంస్కృతిక వైభవమిది -

సంకుచితత్త్వాన్ని దరిచేరనీయని
సువిశాల దార్శనిక సహన సంపన్నం!!

అబద్ధాలు- అన్యాయాలు
కుట్రలు - కుహాకాలు
కుహనా మానవీయత
సంకుచిత - సంక్షోభ్యత
ఇవన్నీ -
పాశ్చాత్యుల రాకతోనే
ఈ కర్మభూమికి దాపురించాయి!
సనాతన ధర్మాన్ని కలుషితం చేశాయి;
స్వచ్ఛమైన అలనాటి హిందూతత్త్వాన్ని
విజ్ఞతతో ప్రబోధించే విప్లవమూర్తి కరువై
ఈనాడు
'మతం మత్తుమందు' అనే స్థితికి చేరింది!
ఒక వివేకానందుడు - ఒక రామకృష్ణుడు
ప్రభవించి ప్రబోధించినవేళ
ఈదుష్టశక్తులన్నీ
నవరంధ్ర విచ్ఛిత్తితో నిశ్శేష్టమయ్యాయి;
నిర్వీర్యమైన హైందవ జాతి
నిర్లజ్జగా నేడు
పాశ్చాత్యమత వాదానికి
ప్రణమిల్లి, పాదాలు కడుగుతోంది;
జాతికి పట్టిన నిర్లిప్తపిశాచి
పరాధీనత వైపు పరుగులు తీయిస్తోంది;

పంచాక్షరి కొందరి ముందర
వంచాక్షరిగా పరిగణింపబడుతోంది -
సంస్కృతాన్ని తుడిచేశారు
హైందవాన్ని అణచేశారు
ఆంగ్లభాష రుద్దించారు
క్రైస్తవాన్ని ప్రాకించారు

ధర్మబుద్ధి తొలగించారు
కపటబుద్ధి నేర్పించారు
బానిసలను గావించారు
బ్రతుకు తీరు మార్పించారు

ఈ స్వాతంత్ర్యం ఒక డొల్ల
ప్రజాస్వామ్యమొక కల్ల
జాత్యభిమానం కన్న
బానిస బుద్ధేమిన్న-
ఇంకే మగునీ దేశం?
ఏమిచ్చును శుభ సందేశం??
సంస్కారపు చేవ నశిస్తే
నిస్తేజం మనను వరిస్తే
మనజాతికి పరువేముంది?
విజ్ఞానపు బరువేముంది?

కలగాలి జాత్యభిమానం-
మారాలి బ్రతుకులవైనం;
రావాలి నూతనతేజం
తెలియాలి మనుషుల నైజం!! (ఆగస్టు 1999)

# పవిత్ర భారతి

అగ్నిచుట్టూ ధూమం లాగ
నాపవిత్ర భరత భూమి చుట్టూ
ఎన్నో కశ్మలాలు కమ్ముకుంటున్నాయి-
అయినా ఎప్పటికప్పుడు గంగాజలంతో
నా జన్మభూమి పునీత అవుతూనే ఉంది!
అండర్‌గ్రౌండ్ డ్రెయినేజీ
అన్నిరంగాలనీ కలుషితం చేస్తున్నా
ఆ సేతు శీతాచలపర్యంతం ప్రభవించిన
ధార్మికౌషధులు
సకల వ్యాధుల్నీ నివారించి
సంస్కృతిని కాపాడుతున్నాయి!
వేలయేండ్ల చరిత్రకల్గిన యీ ధర్మక్షేత్రం
ఎన్నోకురుక్షేత్రాల్ని చూసింది;
ఎందరెందరో అంభినామధేయుల్ని
జయచంద్రులని, నైజాముల్ని
ప్రజల ధనమానప్రాణాల్ని విందారగించిన
మనుష్యాకారుల్ని చూసింది!
అయినా-
ఇక్కడ భూ కంపాలు రాలా;
ఇటువంటి గంజాయి మొక్కల్ని గుంజేయటానికి
ఎటువంటి ప్రళయాలూ సంభవించలా!
దేవదేవుడు ఇప్పటికీ మరో అవతారం ఎత్తలా!

గంగ ప్రవహిస్తున్నంతకాలం
భారతీయులకి
కశ్మలభయంలేదు
సాక్షాత్తూ ఆనాటి దుర్యోధనుడు, రావణాసురుడు
ఇద్దరూ ఒకే అంశతో పుట్టుకువచ్చినా-
ఐరోపా జాతీయులందరూ
ఏకాంశరూపులై మళ్లీ పాలకులుగా వచ్చినా-
మన భారతం చెడదు!
చెడే స్వభావం కలిగి ఉంటే
ఎప్పుడో దానికి చేటుమూడి ఉండేది!
బంగారానికి చిలుము పట్టనట్లు
పవిత్ర భారతికి నాశనం ఉండదు!
ధర్మానురక్తి కలిగిన
కర్మానుసారి ఒక్కడున్నంత వరకు
మన కర్మభూమిని కబళించే
ఘోరకలి ఆటలు సాగవు;
ఎప్పటి కప్పుడు మహాదేవుడుదయిస్తుంటాడు-
భారతి పవిత్రతని కొనసాగింపజేస్తాడు!!

(సెప్టెంబరు 1999)



+28